స్త్రీ—"ఛో ఛో!" యని యందువుకాదా? నేనిప్పు డె క్కడకుం బోవుదును.

పురు—ఎక్కడకుబోదునో యన్నడుగ నేల? ఇంత విశాలప్రపంచమున నీకు దావే లేకుండునా?

స్త్రీ—కావున నకు లోపమేమి? నన్నిప్పుడెవ్వడు చూచును?

పురు—ఆమాటలన న్నేలయడిగెదవు? నీకర్మమెటులుండునో! నాకక్కర లేదు. ఛో!

స్త్రీ—నాకర్మమిప్పుడు నీకుంగావలయునా? నేను క్రొత్తగ గానికివచ్చినప్పుడు నాకర్మము నీకుంగావలసివచ్చినది. "నీవుస్థిరచిత్తురాలవు. ప్రపంచవిముఖత్వము నీ మొగమందు కనబడుచున్నది. నీకు మంత్రిలు నాసనములు మొదలగునవి చెప్పెదను"నని నాచుట్టు మట్టుతిరుగునప్పుడు నాకర్మమునీకుం గావలసివచ్చినది. నీమాటిములోనన్నుం బెట్టుకొని రాత్రులందు వేదాంతము చెప్పినట్లు చెప్పి నన్ను మెల్లగ స్వాధీనపఱచుకొనినప్పుడు నాకర్మము నీకుం గావలసివచ్చినది. ముచ్చటతీరినది కావున నిప్పుడుపొమ్మనుచున్నావా? సిగ్గుమాలినవాడా! నీవేదాంతము మండ.

పురు—ఛో! ఛో! మహాప్రపంచము. కారణాంతరమున కలిసియుందుము. కారణాంతరమున వేరుందుము. "నీరాగా

షకాలము పశ్చాత్తాపమునందును బరమపురుషధ్యానమందును గాలముగడుపుకొనుమనియు నిన్నొక్క దేవాలయమునందో మఠమునందో యుంచి సంరక్షింతు''నని యు నాతఁడు చెప్పెను. ఆమాటలకామె మహాకష్టమున సమ్మతించెను. మంత్రియామెను తనయింటికాదినమునకు తీసికొనిపోయెను. ఆమె వారియింట భోజనము చేయదు. అదిగాక వైరాగినులలో కలసినది కావున మతభ్రష్టురాలని వారుపక్తినిచ్చుటకు సందేహమును బడిరి. ఈమె యొక చిన్నయింటిలో పండుకొనెను. మరునాఁడుదయమున నామె నూతివద్ద స్నానము చేయుచుండెను. దుర్గాదేవాలయమున కామెనుబంపఁ బ్రధానుడు నిశ్చయపరచుకొనెను. పోవుటకామె స్నానము చేయుచుండగా ప్రధానుని భార్య తనసంవత్సరపు వయస్సుగల కుమారునెత్తుకొని నూతియొద్ద నిలువఁబడెను. ఆపిల్లవాడు చేతులెత్తి యాకస్మికముగ నెందులకో యామె ప్రక్కనుండి యెగిరెను. దురదృష్టమున నూతిలో పడిపోయెను. "మొర్రో మొర్రో" యనుచు తల్లి యేడ్చుచుండగా గుబుక్కున నీకాంత నూతిలో నురికి యగాధమగు నీట మునిగి బాలునెత్తి కాళులతో తాను నిలువీతనీదుచుండెను. ఇంతట నిచ్చెనలతోడను, త్రాళ్ళతోడను జనులువచ్చిరి. వానిసహాయ్యమున నామె పిల్లవానితో పయికివచ్చెను. ఆమె సందరు

కొనియుండిరి. ప్రధానుడు నతనిభార్యయు "నీవు భగవంతునిచే మాయింటికి బంపబడిన రక్షకదేవతవుకాని యొండుకాదు. నీవెచ్చటకుఁబోవలదు. మాయింటిలోనే యుండు" మని యామెను బ్రార్థించిరి. ఆమె యంగీకరింపలేదు. వారామెను విడువలేదు. "సరే! యిఁకఁ బదిదినములుండి పోవుదును లెండు" అని యామెవారిని సమ్మతింపజేసి యటనే వేరుగ వండుకొనుచుండెను. ఈబైరాగిని నామ మిందిర. ఈమె మిగుల తెలివిగలది. బహుజాగరూకురాలు పరమయోగ్యురాలని ప్రధానుడు నాతనిభార్యయు రెండుమూడుదినములలోనే కనిపెట్టిరి. సర్వపురాణములలోనికథలను వారిద్దరకీమె మృదుమధురవచోగుంభనమున నుపన్యసించుచుండెను. పాటలు మిక్కిలిమనోహరముగఁ బాడుచుండును—ఈమెవచ్చిన రెండుమాసములకే యీయామెను మిక్కిలిగౌరవముతో సందరు చూచుచుండిరి. ప్రధానుడీమెయందు మిగుల ప్రపత్తిగలియుండెను. తేలుకుట్టినవారు, పాముకఱచినవారు, దయ్యముపట్టినవారు, మహాద్భుతమగు నీమె మంత్రములచే బాధానిర్ముక్తులగుచు నీమెను దైవస్వరూపిణిగఁజూచుకొనుచుండెడివారు. ఇట్టు లారుమాసములు గడచినవి. ఆమె యెప్పటికప్పుడు దుర్గాలయనివాసమునకై తొందర పడుచుండెను.

ప్రధానుడు నాతనిభార్యయు నామాట చెవినిబెట్టరైరి. ఒక దిన ముదయమునఁ బ్రధానుని యింటియెదుట జనులనేకులు మూగియుండిరి. ఇందిర వారియింటికివచ్చినతరువాత నట్టిజన సమూహము తఱచుగ నేదియో యొకబాధను బోగొట్టు కొనుటకై యామెదర్శనమునుగూర్చి వచ్చుట యాచారమై యుండెను గాని యాదినపుగుంపు మఱింతప్రబలముగ నుండెను. ప్రధానుఁడు గ్రామమున లేడు. ఆతనియింటిలోఁగూడ నల్లరిగనేయున్నది. ఆతని దొడ్డిగోడకుఁ బెద్దకన్నము త్రవ్వబడియుండెను. ఆకన్నమునొద్ద నొకపెద్దకత్తి యుండెను. ప్రధానునిభార్య యలంకారములన్నియుఁ బోయినవి. యోగిని యెచ్చటను గానబడదు. ఆమెయందు లేశముగాని ప్రధానునిభార్య కవిశ్వాసము లేదు. "ఆమెయెచ్చటకోపోయినది ఇప్పుడేవచ్చును." అని యామె యనుచుండెను. జాముప్రొద్దెక్కినది. జామున్నరప్రొద్దెక్కినది. ఇందిర రాలేదు. వస్తువులు పోవుటకంటె నిందిరపోవుటయే యామెకు ఖేదతరముగ నుండెను. "దొంగముండ" యని కొందరు "నమ్మించి నమ్మించి గొంతుకోసిన"దని కొందరు "ఆమె యిక వచ్చున దేమిటి?" యనికొందరు "ప్రధానుఁడూరలేని సమయము చూచి చేసిన"దని కొందరు నిట్లు పలుకుచు నెవరియిండ్లకు

పారిపోయిరి. ఫ్రిథానునిభార్య వెంటనే తనభర్తకొరకు వార్తనంపగ నాతఁడు సమీపగ్రామములోనే యున్నవాఁడగుటచే మధ్యాహ్నమునకు వచ్చెను. ఇందిరకొరకు చుట్టుపట్లనున్న గ్రామములఁగూర్చి జనులు వెదకువారై పోయిరి. ఆమె యెచ్చటనున్నదైవరివలన వార్తవచ్చునో శీఘ్రముగ వినవచ్చునని కొందర సేవకులను తనయింటిగుమ్మములోనేయుంచి యటునిటు చూడనియమించెను. ఇటులుండఁ గొంతసేపటికిద్దరు భటులువచ్చి "యోగిని పట్టుబడి తేఁబడుచున్న"దని ఫ్రిథానునితో జెప్పిరి. అంత నాతఁడు సంతసించి వీథిగుమ్మములోనికివచ్చి వీథిచివరనుండి గంజికాలుపట్టి తేఁబడుచున్న యిందిరను జూచెను.ఇందిర లోపలఁబ్రవేశపెట్టఁబడెను.ఆమె యొడలిపై నచ్చటచ్చట బఱికినట్లు కరచినట్లు గాయములుండెను. ఆమెధరించినబట్ట రక్తపుమరకలతో నిండియుండెను. ఆమె కొడలినిండ నెంతెంతకుములు దెబ్బలు తగిలెనోకాని నడచుటకామెకు శక్తిలేదు. సరేకదా? కూర్చుండుటకయిన లేకుండెను. ఒడలు నొప్పులని బాధపడుచుండెను. మాటలాడలేకుండ పండుకొనెను. ఆమెను మోసికొనివచ్చినవారికి నూరురూపాయిలు బహుమానమును బ్రిథానుడీబోయెను. అప్పుడు యోగిని "వారితో నేనొప్పుడలఁజేసికొనిన ప్రికా

రము చెరియొకరూపాయనిమ్మ"ని ప్రధానునితో నిమ్మళ ముగఁ జెప్పెను. "ఇప్పుడలయేమి"టని ప్రధానుఁడు వారినడుగ మేమరణ్యమునుండి పుల్లలు తెచ్చుకొనుచుండగా మట్టను ధ్యాహ్నమున దారిలో నొకపొదయొద్ద మూల్గువినఁబడెను. ఆధ్వనియేమోయని యచ్చటకుబోయి యీమెనుగాంచితిమి. బాధచే నేడ్చుచుండెను. "నన్ను బ్రధానునింటికి మీరుదీసి కొనిపోయినయెడల మీకు జెరియొక రూపాయనిచ్చెదను" అని యీమె చెప్పినది. ఇంతకంటెనామెవృత్తాంతమేమియుఁ జెప్పలేదు. అడవిలో జచ్చిపోవునేమోయని భయపడి యీ మెను మోసికొనివచ్చితిమి. ఈవీధిలోనికి వచ్చినతరువాత మీసేవకులు కాఁబోలు నిద్దరు మమ్ముఁజూచిఁపట్టుకొంటిరా?" యని యీమెను దిట్టనారంభించిరి. ఈమె యేదైన తప్పుఁజే సినదేమోయని మేమనుకొంటిమి. ఇంతకంటె మేమెఱుఁగ ము."అని వారుచెప్పిరి. "మీకీయవచ్చిన నూరురూపాయలు తీసికొవలసిన"దని ప్రధానుఁడు వారికాసొమ్మిచ్చెను. వారు సంతసించుచుఁబోయిరి. సాయంకాలమగుసరికి యోగినికిఁ [illegible]మిశత కలిగెను. అంతట నామెప్రధానునిభార్యను బలచి"అమ్మా! మీసొమ్ము కష్టార్జితము. ఇదిగో! మీనగల మూట"యని యొక పొడుగుమూటను నడుమునుండివిప్పి

యామె చేతిలోఁ బెట్టెను. వస్తువులుకొన్ని నలిగి మడిగి యున్నవి. అంతనామెస్నానమొనర్చి తమయింటిలో భోజనము చేయుమని ప్రధానుడెన్నివిధములఁ బ్రార్థించినను వినక స్వయముగఁ బచనమొనర్చుకొని భుజియించి యూరాణి ప్రధానుతో నాతనిభార్యతో నిట్లని చెప్పఁదొడఁగెను. "నిన్నరాత్రి దాదాపుగా నొంటిగంటకు దొడ్డిలోఁ గొంత చప్పుడయినది. పిల్లియో కుక్కయోయని యెంచి యూరకుంటిని. మరి యైదు నిముసములకు వికృతాకారులగు నిద్దరుదొంగలు లోనికివచ్చిరి. దీపమొకఁడు సన్నగింపఁజేసెను. నాకుఁ గొంతసేపటివరకు నోటివెంట మాటరాలేదు. ధైర్యము తెచ్చుకొని యొక వెఱ్ఱికేక వైచితిని. మాకెవ్వరకది వినబడలేదు. దొంగలలో నొకఁడు నాగొంతదిమి నోటిలో గుడ్డనుగ్రుక్కి కదలిన యెడల నీకత్తితో నఱుకుదునని సంజ్ఞనుజేసెను. మిగిలినదొంగ మాగదిలోఁ బ్రవేశించి మానగలొలుచుకొని నేను బందుకున్న తుంగచాపయొద్దకువచ్చి యవియన్నియు దండెముపైనున్న పాతగుడ్డలో మూటగట్టెను. ఇద్దరు నన్ను చెరియొక చేయిబట్టుకొని లేవదీసి దొడ్డిలోనున్న కన్నమునొద్దకుఁ దీసికొని వెడలిరి. ఆప్రక్కనున్న తలుపునుదీసి వారునన్నుగూడ వీధిలోనికిఁగొనిపోయిరి. "నీవొక గడియవరకుఁ గేకలువై

వకు" అని నాతోఁ జెప్పిరి. వారిలో నొకఁడు నాచేయి పట్టుకొనియే యుండెను. రెండవవాఁడు మూట చేబుచ్చుకొని పోవుచునేయుండెను. అంత నేనేమియుఁదోచక కన్నమునుండి వెలుపలకుబడిన యిటుక బెడ్డ నొకదానిని దీసికొని యొక్కటి విసరితిని. అంత మూటఁదీసికొని పోవువాఁడు చాపచుట్టుగఁ గ్రిందబడెను. ఆదెబ్బ యాతనికిఁ గణతనే తగిలెనో ముచ్చెనగుంటలోఁ దగిలెనో తెలియదు. అంతట నన్నుబట్టుకొనిన యాతఁడు నన్నువదలి క్రిందఁబడిపోయిన యాతనిని బుజముపై వైచుకొని పరుగెత్తఁబోవుచుండ నక్కడనున్న తూములోనుండి మరియొక దొంగ పైకివచ్చెను. అంత దొంగ నెత్తికొనిన యాతఁడు క్రిందబడినవానిచేతిలోనున్న మూటనుదీసి తూమునుండిలేచిన క్రొత్తవానిచేతికిచ్చి 'ఉరుకు'మని సంజ్ఞచేసి తాను దొంగనుదీసికొని మరియొక ప్రక్కకుఁబోయెను. ఇదియంతయు రెప్పవ్రేటుకాలములో జరిగెను. నేను మూటదీసికొని పోవువానిని మైమరచి వెంబడించితిని. ఆతఁడు కొంతసేపు బాటమీదుగఁబోయి తరువాత నడవిలోనికిదారి దీసెను. వానివెంటనే నేనుగూడఁబోయితిని. ముండ్లుగీచుకొని పోయినను రాళ్ళుతగిలికాళ్ళుపగిలినను గూడ బరుగెత్తితిని. నేనొక్కఁడనే కాక నాతోఁగూడఁజాలమందితనవెంటఁబరుగె

త్తుచున్నారను నమ్మకమాతనికిఁ గలుగునట్లు "ఇంక నేను వెనుకనుండెద రేల? రండి. ఇదిగో!" యని కేకలువైచితిని. అంతట మిగులఁ దొందరలో పరుగెత్తుచు "టక్కు" మని యేదో కాలికిఁ దగుల గుభిల్లున నాతఁడు భూమిపైఁబడెను. అంతట నేనాతని సమీపించి చేతిలో గత్తియున్నదేమోయని చూచితిని. కత్తియెందుచేతనో కనబడలేదు. చేతిలోని మూటఁ దీసికొంటిని. ఆతనికిఁ గాలువిరిగియుండుటచేఁ గాఁబోలు లేవలేకపోయెను. గాని నన్ను కరచి పీఁకి వదలిపెట్టెను. ఏమైననరే మూటదొరికినదిగదా? యని సంతసించి తిరుగ వెనుకకుఁ బరుగెత్త నారంభించితిని. కొంతదూరము వచ్చినతరువాత దొంగను మోసికొనిపోయినయాతఁడు కాఁబోలు నాబరువునెచ్చటనో దించుకొని సొమ్ముకొంకు నాకెదురుగావచ్చుచుండెను. అప్పుడప్పుడు చిన్నయీలవేయుచుండెను. నేనుపొదలలోదాఁగి పల్లములఁబండుకొని దుబ్బులలోదూరి యిట్లువానికిఁ గనపడకుండనుంటిని. వాఁడు పోయిన వెనుకఁ దిరుగ మనయూరికై రాఁబోవుచుంటిని. వారివెంటఁ బోవునప్పటి యుత్సాహము తిరిగియింటికి వచ్చునప్పుడు లేకపోవుటచేఁ గుంటుకొనుచు నక్కడ నిక్కడఁ గూరుచుండుచు బయలుదేరితిని. ఇంతట నాదొంగకేమి సందేహము కలిగెనో ముందునకుఁబో

వుచున్నవాఁడు వెనుకకుతిరిగినన్ను వెంటాడింప మొదలుపెట్టెను. ఇంతలో తెల్లవారవచ్చుచుంటచే నడివికిపోవువిద్దఱుజనులుమాటలాడుకొనుచునా కెదురుగవచ్చుచుండిరి. వారికైన నేనుగానఁబడక దాగియుంటిని. ఆమాటలు వినికాఁబోలు ఆతడుతిరుగనరణ్యములోనికిఁ బరుగెత్తెను. అంతటఁదెల్లవారెను. నాశక్తియంతయు నుడిగిపోయెను. ఒక్కయడుగైన నిడ్డలేక యొక్కపొదయొద్దకూర్చుండి సొమ్మసిల్లితిని. అంతకు ముందీమూటను మాత్రము పొడుగుగగట్టి నడుమునకు బిగించుకొంటిని. ఆ యాసముచే మూర్ఛపడితిని కాఁబోలు. లేచుసరికి సూర్యుడు నెత్తిపైఁ జెట్లయాకులనడుమనుండి కనపడినాడు. ఒడలిపోటు భరింపశక్యముగాకుండ నుండెను. ఇంతలో నెవ్వరిమాటలో వినబడెను. వీరు తెల్లవారుజామున నడివికిఁబోయినవారేకద యని గ్రహించి బిగ్గరగనేడ్చితిని. "కూలినిచ్చెదను.నన్నుమోసికొనిపొం"డని వారిం బ్రార్థింపగ వారిట్లుచేసిరి" అనిచెప్పి పెద్దనిట్టూర్పువిడిచెను.

ప్రధానుడు నాతనిభార్యయు నామెశౌర్యమునకు విశ్వాసమునకు నాశ్చర్యపడిరి. "దొంగలుతొందరలోఁబోవునపుడుకత్తిని గన్నమునొద్ద మఱచియుండిరికాని లేనియెడలనీమెను వారు నఱికియుందురు."అని ప్రధానుడు భార్యతోఁజె

ప్పెను. ఈవృత్తాంతమంతయు తత్పురమునబ్రాకెను. ఇట్టి విద్యావతి ఇట్టిశౌర్యవతి వేదకాలములోనేకాని యిప్పుడు లేదని యందఱా మెనుస్తుతించిరి. ఆరాష్ట్రాధిపతియుగూడ నాశ్చర్యమునొందెను. ఆపురజనులందరుచేరి యామె గౌరవార్థమైయొకసభచేసిరి. దానికి రాజుగారగ్రాసనాధిపతిగనుండెను. ఆమె శౌర్యౌదార్యగాంభీర్యయోగ్యతలగూర్చి పండితు లుపన్యాసములిచ్చిరి. కవులుపద్యములొనర్చి చదివిరి. రాజుగారు తమగంభీరోపన్యాసములో నామెనుబొగడిరి. "వీరయోగిని" యను బిఱుదామెకు రాజుగారిచ్చిరి. వీరయోగిని తగుమాటలతో ప్రత్యుత్తరమిచ్చి తనవందనములు ప్రభునకుఁబ్రజకు నామెసమర్పించుకొనెను. ఆమె రాజుగారిభార్యనుదర్శించుటకై రాజుగారిచే కోటలోనికిఁ గొనిపోవబడెను. వీరయోగినిని రాణిగారుచూచి "తనయొద్దనుండు" మనియామెనుకోరెను. రాజుగారుగూడ నామెనుకోరిరి. ప్రధాను డిష్టపడడేమోయని రాజుగారు ప్రధానునితోకూడఁజెప్పి యొప్పించిరి. ప్రధానుని భార్య యభ్యంతరముసెప్పునేమోయని రాణిగారామెనుపిలించి చెప్పి యొప్పించిరి. ఆనాటినుండియే వీరయోగిని కోటలో రాజాంతఃపురమున నివసించుచుండెను. రాజదంపతులకేమి కోటలోని రాజోద్యోగులకేమి యామెపైమిగులగౌరవము

గనుండెను. రాణికామెగుండెకాయ ఱై యుండెను. ఇట్లు కొం
త కాలము జరుగగ నా పురమునకుఁ దంజావూరుసంస్థానపు
పరిధానుడు కానికిరోప్రుడు వచ్చెను. ఒకనాటి సాయంకాలమున
రాజుగారినిదర్శింప నాతఁడు కోటలోనికివచ్చెను. పరిధాను
మూర లేదు.—రాజుగారా తంజావూరుపరిధానుని గౌరవించి
తమసంస్థానములోని యమూల్యరత్నాభరణములను జూప
నెంచి వీరయోగినిని లోనుండి పిలిపించి “ రా ణి గా రి
యొ క్క చిన్న తా ళ ము తో నిను ప పె ట్టె ను తె ర చి
యమూల్యమైనన్ని యాభరణపు చిన్న పెట్టెలను నీవిటకుఁదెప్పిం
పు” మని యామెతోఁ జెప్పెను. ఆమెలోనికిఁబోయి యట్లుచే
సెను. ఎంతవింత నగలన్నియు వేరువేరుగ నాపరిధానునకు
రాజుగారుచూపిరి. చివరకొక్క చిన్న పెట్టె తెరచి యందు
లోని గుండాయినితీసి “యిది మా యాదిపురుషునకు ఢిల్లీపాదు
షా గారిసంస్థానముతో కూడనిచ్చిరి.” అని దానినిఁజూపెను. అది
పరిధానుడు చేతఁ బుచ్చుకొని కన్నులకద్దుకొనెను. ఆచిన్న పె
ట్టెలన్నియు తిరుగ నొక పెద్ద పెట్టెలో వీరయోగిని యుంచి
యా పెట్టెను బాలసేవకులదలపైఁ బెట్టించి నగరులోనికి మో
యించుకొని పోయెను. అచ్చటరాణిగారిసన్నిధినవియన్నియు
నామెకు వేరు వేరుగఁజూపి యినుపపెట్టెలో భద్రపరచి

యా తాళమును రాణి మెడలో కట్టెను. తంజాపూరు ప్రధానుడు వెడలిపోయెను. ఇట్లు మూడుమాసములు గడచిన పిమ్మట విజయదశమి వచ్చెను. రాజుగారు గొప్పసభ యాదినమున జేయుటయు నుద్యోగులకు బహుమానములిచ్చుటయు సర్వాభరణభూషితుడై పట్టపు గజముపై నెక్కి సవారి చేయుటయు వాడుక కలదు. మధ్యాహ్నపుసభ జరిగినది. రాత్రి యంబారియుత్సవ మింక జరుగలేదు. కోటలో గగ్గోలుగ నున్నది. మంత్రి కోటకుం బరుగెత్తెను. రక్షకభటులు పరుగెత్తిరి. కొంత సేపటికి "సంస్థానపు పెద్దతురాయి పోవుటచేత నుత్సవ మాపివేయబడిన" దను వదంతి కలిగెను. ఎట్లుపోయెనో యెవ్వరెఱుంగును. రాణిగారికి నాభరణములన్నియు నొకటివెనుక నొకటి చూపించి మరి పెట్టిలో వేసి తాళము తన మెడను నోగినికట్టుటచేత నామెపై రాణిగారికి రాజుగారికిం గూడ సందేహము లేదు. ఇనుపపెట్టె పగులంగొట్టిన జాడ లేవియు లేవు. "తురాను హరించినవానిని పట్టుకొనినయెడల దగు బహుమానములిచ్చెద"మని సంస్థానమంతం జాటింపంబడినది. సంస్థానముతోంగూడవచ్చిన యాభరణమగుటచే రాజుగారికి మిగుల ఖేదముగనుండెను. ఇట్లు కొన్నిదినములు గడచెను.

మధురాపురమునకు బదియామడ దూరములోనున్న యొకపట్టణములో నొకఁడు తత్పురవర్తకునియొద్ద కొక్క-తురాయినమ్మకమునకై తెచ్చెను. ఆతఁడు సంస్థానవర్తకుఁడగుటచేఁ దురాయిని రాజుగారిదిగా నానవాలుపట్టి రక్షకభటులకాతనినొప్పచెప్పెను.ఆతఁడు'దొంగ'యనిరక్షకభటాధికారి నిశ్చయపరచి యాయూరనుండు న్యాయస్థానమునకాతనిఁగొనిపోయెను. అచ్చట న్యాయాధిపతి యాదొంగను, విచారింపగ "నీయాభరణమును రాజుగారు నాకంపిరి." అని ప్రత్యుత్తరము చెప్పెను.వీడుపిచ్చివాడువలెనున్నాఁడని న్యాయాధిపతియెంచిఁరాజుగారు నీకంపినట్టునిదర్శనమే' దనియడుగనొకచిన్నపెట్టెనుదీసి యొకయుత్తరము న్యాయాధిపతిచేతికాతఁడిచ్చెను. దానిపైరాజుగారి దస్కతు మొహరున్నది. అదిచూచి యాశ్చర్యపడి యేమిచేయుటకుఁదోఁచక యాతనిని తల్లేఖాసహితముగా రక్షకభటుల స్వాధీనపరచి రాజుగారియొద్దకుఁ బంపెను. రాజుగారాదొంగనుచూచిరి.ఆయుత్తరమునుచూచిరి. ఆయుత్తరమిట్లుండెను. "విద్యారత్నగురువుగారికి రాజు నమస్కారములు. వీరయోగినియగు నిందిర మీకు నాతురాయిని గురుఫలముగానిచ్చుటకు నేను సమ్మతించితిని. విజయగోపాలవర్మ మహారాజుగారు" ఆదొంగ

నల్లనిగడ్డము బుగ్గమీసములు గలవాఁడయి వడికైచిన కోర పాగ గలవాఁడై కచ్చ వెనుకకు బిగించినవాఁడై మొలలో జరకత్తి కలవాఁడై రాజపుత్రునివలె నుండెను. ఆయుత్తరము క్రింద రాజుగారి మొహరున్నది కాని యది యెవ్వరివ్రాతయో తెలియలేదు. "ఈవ్రాత యెవ్వరిదో తెలిసికొను" మని యాయుత్తరమును ప్రధానుని చేతికి రాజుగారిచ్చెను. ప్రధానుని కావ్రాత వంటివ్రాత చూచినట్లు జ్ఞప్తి యున్నది కాని బాగుగా స్ఫురింపలేదు. ఆయుత్తరము నింక బాగుగా నిదానించుట కాతఁడింటికిఁ గొనిపోయెను. భార్యకు దానిని గనఁబరచి "యీవ్రాత చూడు" మని చెప్పెను. ఇది వీరయోగినిదని యామె చెప్పెను. నీకెట్లు తెలియు నని యడుగఁగ నివిగో యామె వ్రాసియిచ్చిన పాటలని కొన్ని కాగితములనుఁ దెచ్చి చూపెను. మంత్రి యాశ్చర్యపడెను. మంత్రి యా కాగితములన్నియుఁ దీసికొని కోటలోనికిఁ బోయి రాజునకుఁ జూపెను. రాజు కొయ్యమైపోయెను. వీరయోగిని పట్టుకొనఁబడినది. ఆనాఁడు రాజుగారి యెదుట విచారణకై దొంగయు, నీమెయుఁగూడ నిలువఁబెట్టఁబడిరి. "వీరయోగినీ! నీవెఱిగిన దేదియో చెప్పిన యెడల నీకు మరణ దండనము విధింప" మని రాజుగారు పలుకగ వీరయోగిని "మహాప్రభూ! ఈతడు నాగురుడు. యీతనికి గురుకట్నమి

చ్చుటకై నేనిట్లుచేసితిని. విజయదశమికిఁ బూర్వపురాత్రి
రాణిగారి మెడలోనున్న తాళమునువిప్పియినుపపెట్టె తెరచి
తురానుఁదీసి చిన్నపెట్టెలోఁ బెట్టి యీయుత్తరమువ్రాసి
మీచిన్న పందుగలోనున్న మొహరుదానికివైచి యీయు
త్తరముకూడ నాచిన్నపెట్టెలోనుంచి యాపెట్టెకు లక్కనా
లుగుపయిపులసంటించి మీముద్రదానిపై నంటించి టపాలో
నీతనికిఁబంపితిని"అని పల్కెను. "మీరుపంపినారని నేనుఁబు
చ్చుకొంటిని." అనిదొంగ చెప్పెను. రాజు మహాశాద్రిమూ
ర్తియై వారికిద్దరకు ద్వీపాంతరవాస శిక్ష చెప్పెను. అంతట
దొంగ కొంచెము ముందునకువచ్చి రెండు చేతులుజోడించి
"మహాప్రభూ! జయ! విజయీభవ! పగటిభాగవతుల ప
ద్మనాభశాస్త్రిగాడను. రక్షించు"డని చెప్పుచు వేషముఁ
దీసివైచి యంగవస్త్రధారియై యెదుటకసఁబడెను. రాజు ని
శ్చేష్టుడయ్యెను. "మహాప్రభూ! మూడుసంవత్సరములక్రిం
దనొకరాత్రిమీరు నేను దొంగతనమునుగూర్చిప్రస్తావనజే
సికొనచుండగా "పద్మనాభశాస్త్రీ! మాయంతఃపురములో
నున్న గొప్పవస్తువు నీవేదైన చమత్కారముగ సంగ్రహిం
పగలవా?"యని నన్నుమీరడిగిరి. "క్షమింతునని"వరమిచ్చినఁ
"జేయుదు"నని నేనుచెప్పితిని. "క్షమింతు"నని మీరు సెలవిచ్చిరి.

నేటికి పదిమాసములనుండి బహుప్రయత్నములు చేయుచుం టిని. ఈచిన్నది నామేనకోడలు. ఈమెవచ్చుట కిన్నాళ్లు రా లేదు. తంజావూరు ప్రధానుడని వేషముచేసి కొనివచ్చినది నేనే! మీరాతురాయిని నేను కన్నులకద్దుకొంటిని. అవస్తువును గ్రహించవలసినదని యిట్లు నామేనకోడలికి తెలిపితిని. “పద్మనాభశాస్త్రీ! యెంతవాడవు? నీ మేనకోడలిచే ముందుగు ప్రధానునింటిలో నేలప్రవేశ పెట్టితివి?” అని రాజడిగెను. “మహాప్రభూ! ఆమెవలననే విందురుగాక” యని పద్మనాభశా స్త్రి బదులు చెప్పెను. వీరయోగిని యిట్లు పలికెను. “నేను వైరాగివేషమువేసిననాథ ర్తయును నడుమవీథిలో గలహాపడుట యసత్యకలహము. ప్రధానుడా దారి నప్పుడు వచ్చునని యె రిగి యచ్చటకలహమాడినట్లు నటించితిమి. నాథర్త నన్ను విడిచిపోవగా ప్రధానుడు నాయెడల నిజమైనజాలిదలచి యాతనిఇంటనున్నం చెను. అక్కడ నేదైనగొప్పపనిచేసినట్లు వె ల్లడియైనగాని నేనుకోటలోనికి బ్రవేసించుటకు వీలులేదని యెఱిగి యొకరాత్రి నాథర్తచేత నే కన్నముత్రవ్వించితిని, నేనేప్రధానుభార్యవస్తువులుతీసి మూటకట్టితిని. నాథర్తక ర్తియే కన్నమునొద్ద దొంగలువచ్చిరను గుర్తుకొఱకు పాఱ వేయించితిని. అంతట నేను నాథర్తయు నారాత్రిసుఖముగ

చ్చుటకై నేనిట్లు చేసితిని. విజయదశమికి పూర్వపురాత్రి రాణిగారి మెడలోనున్న తాళమును విప్పి యినుపపెట్టె తెరచి తురాను దీసి చిన్నపెట్టెలో బెట్టి యీయుత్తరము వ్రాసి మీ చిన్న సందుగలోనున్న మోహరు దానికి వైచి యీయుత్తరము కూడ నా చిన్నపెట్టెలోనుంచి యాపెట్టెకు లక్క నాలుగుపయిపుల నంటించి మీముద్ర దానిపై నంటించి టపాలో నీతనికి బంపితిని" అని చెప్పెను. "మీరు పంపినారని నేను బుచ్చుకొంటిని." అని దొంగ చెప్పెను. రాజు మహారౌద్రమూర్తియై నాకిద్దరకు స్వహంతకవాస శిక్ష చెప్పెను. అంతట దొంగ కొంచెము ముందుకు వచ్చి రెండు చేతులు జోడించి "మహాప్రభూ! జయ! విజయీభవ! పగటిభాగవతుల పద్మనాభశాస్త్రిగాడను. రక్షింపుడు" అని చెప్పుచు వేషము దీసివైచి యంగవస్త్రధారియై యెదుటకు వచ్చెను. రాజు సంతుష్టుడయ్యెను. "మహాప్రభూ! మూడు సంవత్సరముల క్రిందనొకరాత్రి మీరు నేను దొంగతనమును గూర్చి ప్రస్తావన చేసికొనుచుండగా "పద్మనాభశాస్త్రీ! మా యంతఃపురములో నున్న గొప్పవస్తువు నీ వేదైన చమత్కారముగ సంగ్రహింపగలవా?" యని నన్ను మీరడిగిరి. "క్షమింతునని" వరమిచ్చిన "జేయుదు" నని నేను చెప్పితిని. క్షమింతునని మీరు సెలవిచ్చిరి.

# పారిజాతాపహరణము.



ముక్కు తిమ్మనార్యకృతము.

ఇది లలితపద భూయిష్ఠమైన యొక చక్కని ప్రబంధము.

ఈముక్కు తిమ్మనార్యుని పద లాలిత్యమంతయు నారద, కృష్ణ, సత్యభామ, సాత్రాజితి చేటికల సంభాషణములలో చదువరులకు స్పష్టము కాక పోదు.

"ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు"

అనున దందఱకుఁ దెలిసిన విషయమే!.





